# బాష్పాంజలి

## (దివ్యస్మృతి)

ఉభయభాషాప్రవీణ
కొత్త సత్యనారాయణ చౌదరి

ఓం

హరిహరి! యెట్టివార్తవిననాయె మహాత్ముఁడె పోయెనంచుఁ జి
చ్చుఁబిడుగొట్టినట్టుపడెటి చూడఁడినగోడును దీర్పనింక నె
వ్వరితరమౌను? సర్వము ప్రపంచము ఘోరవిపత్పరంపరల్
పొరయుఁగఁదాఁటుమాటయియపూర్వపరిస్థితిఁబుంగిఁకుంగదో!

౨

ఓయిమహాత్మ! లోకము నయోమయమైన హతమ్మయిపోయినన
ట్లయిఁక: నిన్నుఁబాసియెవఁడొక్కఁడ నేమిటఁబ్రోచునున్నవో!
న్యాయము చట్టుబండలయి యూఁడిపోయెనె? పాడులోకమా
గాయముమాన్పుకో నయితిగాక కృశించి తపించి పోవదే!

౩

ఒకఁ డుంజోస్యము చెప్పఁడాయె నదియే మోగాని–నిర్భాగ్యజా
తికి నిట్లంచును వ్రాసిపెట్టఁ దుదికీ దివ్యాత్మ నిం గోలుపో
వక యెట్లుండును? బాడులోకమికఁ జావన్ రాదె! యీ దేశమిం
తకు మోక్షంబును జూడ నేర్చునె నిరాధారస్థితిన్ గూలదే!

౪

అయ్యో! దైవమ! యెవ్వ రాదుకొను వారయ్యా మహాఘోరమే
యయ్యెన్: హైందవజాతికింక గతి లేదా స్వామి! యీఘోర మూ
కుయ్యాలించెడి నాథుఁ డేఁడి? యెవఁడో గోరాడి పోరాడి రా
వయ్యా యంచును మోక్షమిచ్చునె! మహాత్మా! నీవు లేకుండఁగా

౫

అదిగో! మొన్ననె తోఁకచుక్క యనియ్యా యీ దేశ దేశాల శ్రా
పదలన్ గూర్చెడివార్త వింటి; మది దౌర్భాగ్యంబుగా మాకె దు
ర్వ్యాధి యీ తీరున నంటఁగట్టెనె! ధరిత్రీమండలంబెల్ల బ
ట్టిదమై యెట్టులు క్రిందుమీఁదగుచుఁ బుష్టిం బాసిపోనున్నదో!

౬

నాటకమివ్విధిన్ ముగిసెనా పరమేశ! యిదేల కో జగ
న్నాటకసూత్రధారివయినాఁడవు గాని విషాదరంగమే
మాటికిఁ దెచ్చి చూపెదవు మాన్షులమారివి–నీదు చేష్ట లీ
పాటికిఁ జాలుఁ జాలు: భువిభారముఁ బెంచియుఁ ద్రుంతువా ప్రభూ!

౭

జనసామాన్యమునిన్ను దైవమనియిచ్చన్ మెచ్చిబ్రహ్మాండసౌ
ధనివాసమ్ముల మెట్టినట్లయిరి గాదా గాంధిజీ! యే యుగం
బునఁగానీ నినువంటి వ్యక్తి కలఁడే! పోవయ్య - మాకేల ద
క్కును నీదివ్యపవిత్రమూర్తి భువిలో ఘోరంబు రూపెత్తఁగా

౮

లోకులు కాకులే యనుటలో నిజమున్నది; కానినాఁడు చీ
కాకయి దేశమెల్లఁ బలుగాకులుగాఁ బడిపోవుదాని న
త్యాఁకల నాఁగి వైచిన మహాత్ముని జంపుకొనంగ బుద్ధి యే
లాకలుగున్? బరాత్పరవిలాసములిట్టివొ యేమొ చెప్పుమా!!

౯

బంగరువాన వెల్లువలు పాఱి ఫలించి ప్రపంచమంతయున్
గ్రొంగున దాఁచిపెట్టు నదిగో! నవభారత మంచు మించి యు
ప్పొంగితిమయ్య: దాని నిజమున్ గుఱితించెడివేళ నిట్టుల
య్యెంగద - యోయి పాపపువిధీ! నినుమెత్తురె లోకులిత్తఱిన్!

౧౦

ఈఁటెల దూసి బల్లెముల నేసెడి జాతికిఁ బాలుపోసి బా
హాటముగాఁ జెమర్చు హృదయంబున నవ్వులు గుమ్మరించునీ
కేటికి నిట్టిదుర్మరణ! మిట్టి పరిస్థితి దాపరించెఁ! 'గుం
డేటిని వేటలాడు మగదేబెలు' పుట్టిరి పాడుభూమిలో

౧౧

ఱెక్కలు లేని పక్షులయి రేపును మాపుఁ బరాయి సేవలోఁ
జిక్కియు స్రుక్కి మిక్కిలియుఁ జేష్పడి నెవ్వగఁ గూరి సత్త్వమున్
దక్కనివింత మానసుల దారి యెఱింగిన నీవె నేఁడు సల్
దిక్కుల శోక దేవతకుఁ 'దిష్ట' యొసంగితివయ్య యక్కటా !

౧౨

పందెము లొడ్డి హత్యలకుఁ బాల్పడు లాఁతి విలాతి సైత మా
నందము కల్గి నీకొక ఘనంబును గూర్చెఁ; ద్వదీయశక్తి మా
కందఱికంటె మానుసులమైతి మటంచుఁ దలంచు వేళ – ఈ
కొందల మేల ! ప్రాణములు గూలినవందును జాతిజాతికిన్

౧౩

ఈయుసు రెట్టులాఱు ! మము నేలెడువారెవరో యటంచు దుః
ఖాయతనంబులోఁ గుమిలి యల్లడ తల్లడగొన్న జాతి కా
ప్యాయము గూర్చి యుగత మరియాద యొసంగిన గాంధిదేవుఁ డ
య్యో! యిఁక లేఁడు: కష్టములకోర్చియుఁ బ్రాణములిచ్చి
[పోయెనా !

౧౪

అనుపమ రాజకీయ సమయజ్ఞత నీ కెటు లబ్బెనయ్య ? నీ
వనిన సమస్త దేశములయందొక పెద్దఱికంబ దేల క
ల్గెనొ మహనీయ ! నీ విమలకీర్తికి దోహదమైన భవ్యవ
ర్తనము దలంప నద్భుతము దంబులుగల్గుచునుండు నిచ్చలున్

౧౫

కలుషమతాభిమాన మొసకం బెసఁ గంగ—ననుక్షణంబు పా
మరులకుఁ బ్రాణగొడ్డమయి మారణహోమము సేయువేళ నం
దఱకును జెల్మికల్మిని ముదంబుగఁ గూర్చెడిదాఁక బుద్ధి-యే
మఱక చరించినాఁడవుసుమా! యిఁకజీవమె పోయె జాతికే

౧౬

మతము ప్రభుత్వవైఖరి సమంబుగఁజూచియు నేర్చికూర్చి య
ద్భుత పరిణామమిచ్చితివి పో! యిది యెవ్వరుచూపరైరి యీ
క్షితి; నదిగాక-యందును విశిష్టత కెక్కిన దివ్యమూర్తివై
బ్రతికితివయ్య నిన్నుఁ గనుభాగ్యమె భాగ్యము నేఁటివారికిన్

౧౭

అవతారంబు సమాప్తమాయెఁ బరమాత్మా! యింక నేరీతి వ
ర్తువొ? లోకంబున నీయనంతమహిమల్ ఘోరంబులైమాఱు ను
త్సవముల్ గూర్చును; గాని నేఁడు భువిలో దౌర్భాగ్యమేనివ్వటి
ల్లి వివాదంబులఁబెంగఁ జేయు: నివి నీ లీలా విశేషంబులా!

౧౮

భారతయుద్ధమైన పిదపన్ యదువంశము వోలెనున్న యీ
భారతజాతి, భాగ్యపరిపాకము దక్కి జవంబువోయి నిం
డారఁగ శోకసాగరమునందు మునింగెఁ గిరీటివంటి మా
వీరుఁడు 'జవ్హరుం'డెటులు విహ్వలభావము వొందకుండునో!

౧౯

నీ దివ్యంబగుజ్యోతి భారతమునందే గాదు లోకంబులోఁ
బాదుల్ వెట్టని చోటు లేదు: సరిగాఁ బ్రారబ్ధముల్ తీఱి యే
దో దక్కెన్ గద మున్న సంబరములో నున్నారమే గాని యి
ట్లాధారంబది కూలిపోవునని జోస్యంబైన విన్నారమా!

౨౦

మా మూఁడేండ్ల కు*మారుఁడే యడలి యమ్మా! గాంధి
[తాతయ్యనే
'బాముల్' వేసియుఁగాల్చెనంట-యనఁగాఁ బ్రాణంబులే
[పోయిన
ట్లైమాజన్మముశూన్యమాయెనకటా! మాప్రపంచంబు రూ
పే మాయున్ గద నీవు కన్పడనిచో నింకేమి కానున్నదో!

౨౧

తనసర్వస్వముధారవోసియు మహాత్యాగంబుగావించి మిం
చిన యీవృద్ధతపస్విమీఁదగుఱిచేసెన్ మూఢుఁడస్త్రంబు వా
నిని మన్నింపదు లోక; మైన నతనిన్ నిర్భాగ్యునింజంపరా
దనియేయీమహనీయునాత్మమనకున్ వ్యాఖ్యానముం జెప్పదే!

౨౨

లోకము నీకు నశ్రువులలో నిలువెల్ల మునింగి తర్పణం
బీక్రియఁ జేయఁగావలసెనే! యదియేమి పురాకృతంబో! నా
కైకనివాసులైన భజియించెడి నీవు వినా ప్రపంచ ర
క్షాకృతి కెవ్వఁడోర్చు! నిది కట్టఁడిదైవముచేయుచేష్టయా!

* చి. కమలాకరము

౨౩

నిన్నుభజించి సర్వధరణీ వలయంబు పవిత్రమయ్యె - నీ
యెన్నిక ఖండఖండముల కేనియుఁ బ్రాఁకి వెలింగె; నింతగా
మన్ననగొన్న దివ్యగుణమాన్యుఁడు లేఁడని పెద్ద సంబరం
బున్నది నేఁటిదాఁక - నదియున్ దుది కిట్లయిపోయె దైవమా!

౨౪

'యేసున్' బ్రాణము తీసి శాశ్వతముగా నేజాతి నిర్భాగ్యమై
గాసింబొందెనొ కన్నులార మనమీకాలంబులోఁ జూతు; మా
దోసంబే యిపు డుప్పతిల్లెనిఁక మాదుఃఖంబుఁ బోకార్పరా
వే సర్వేశ్వర! కావవే! హృదికి నెంతే శాంతిఁ గావింపవే!

౨౫

అకటా! కోటిజనంబు లశ్రుముఖులై యల్లాడి యారీతి న
ర్భకులై నూపురుమంచు నా 'జమున' తీరంబందు-ఆనాఁటిఛా
తికవహ్నిక్రియ కంగలార్చి పరమధ్యేయంబుగా నీదు నా
త్మకు బాష్పాంజలి యిచ్చినారఁట మహాత్మా! నీవు మర్త్యుండవే!

౨౬

ఎవఁడో యొక్కఁడు కందిరీఁగలకుఁ దానే దోయుపాయంబుతోఁ
చి విశాలంబగు కొంపకే మొదలు చిచ్చుంబెట్టె: వాఁడే పున
ర్భవుఁడై నేఁ డిటవచ్చెనేమొ! యపురా! ప్రారబ్ధమీ నీచుఁ డా
యువు ద్రుంచెం గద! యీ మహాత్ముఁ డిఁక లేఁడో పాడు
[లోకంబులో!!

౨౭

అప్పుడే మూఁడవరోజు దాఁటెనకటా! యీబాలగోపాల మో
రువు గాన్పింపని గర్భశోకమవుటన్ రోదించుచున్నారు; నే
మెప్పుడే నిట్టి పురాణపూరుషుని నెందే నింకఁ జూడంగఁబో
ము-పురాణంబయిపోవు నీకథలు మున్ముందెల్ల దేశాలలో

౨౮

గండములన్నిదాఁటెను-సుఖంపడు భారతదేశ మింక నీ
యండను ఖండఖండముల కద్భుతశాంతియు నివ్వటిల్లఁ బూ
జ్యుండవు నిన్నుఁజూచుకొని చొక్కియు నిక్కియు మాకుఁ • [పుణ్యముల్
పండెనటంచుఁజెప్పుకొనుభాగ్యముపోయెఁగదామహాప్రభూ!!

౨౯

హరి యపరావతారమని యందును నిన్ను మహాత్మ! లోకమి
త్తఱినినుగూర్చికుందుట యెదానికిసాక్ష్యము;పైగ-నాఁడుద్వా
పరమునఁగృష్ణమూర్తియుఁగృపారహితుండగుబోయవానికా
వరమునఁజేసి భౌతికనివాసము మానుట విందుమేగదా !!

౩౦

మాయలువన్ని రాజ్యములమాంతము గుక్కఁటఁబట్టినెత్తురుల్
దోయుటఁ ద్రావి మైకములతో నది జీర్ణముగాక జాతికిన్
గాయముగూర్చు నేఁటి పలుగాకులఁ గూళలఁ ఖండలింపఁగా
న్యాయము దీర్పఁగాఁ దగిన నాథుఁ డిఁకెవ్వఁడు చెప్పుచూపితే!

3౧

పనివడి రాయబారము లపారముగాఁ బొనరించిలాఁతి జా
తిని మొదలంట మార్చితివి దివ్యమహామహితాత్మ ! నేఁడు నీ
వనునది వేదమై నలువయైనను గాదనలేని నీతియై
గణుతికి నెక్కెఁగాని సరిగా గుణితింపక పోయె లోకమే !!

3౨

పోరులఁ బచ్చి నెత్తురులు పుచ్చుకొనంగల కుచ్చితంపు వ్యా
పారమె యిష్టమై కులుకు పామరజాతిని నైతమీవు ప్రే
మారఁగ నాదరించియు దయారసముం గురిపించి జ్ఞానభం
డారము చేతికిచ్చియుఁగటా! యిటులైతివి పాడుభూమిలో !!

33

ఇట్టులుసేయవచ్చునె ! యొకింత కొఱంతయు లేని శాంతియే
పెట్టనికోటయై తన వివేకమె దివ్యమహాస్త్రమై తపం
బట్టె యపూర్వరక్షయయి యగ్నిపరీక్షకుఁ బ్రాణమీయఁగా
నెట్టన ముందువచ్చు మహనీయుని మ్రింగితివయ్యొ దైవమా

3౪

నీవొనరించు దోహదము నేర్పున భారతరత్నగర్భకున్
జీవయుఁగల్గె; సాత్త్వికవిశిష్టత జాతికిఁద్రోవ సూపి యు
న్యాప్చవచ ధర్మసూత్రములు సంతనచేసె మహాత్మ ! నీవు శో
భావిభి గావె! నీ విలువ దక్కియుఁ జక్కఁగ వాడుకొంటిమా!!

౩౫

పోనీ! కొండల కేఁగి యొంటరిగ సంపూర్ణంబుగా మోక్ష ల
క్ష్మీనాథుండయియుండరాదె! శుభముల్ సిద్ధించుఁ దద్దర్శనం
బైనన్ మాకని యెంచుకొందుముగదా! మాపాటిపుణ్యంబులే
మైనన్ జేసితిమయ్య? యందని ఫలం బాసింపఁగా దక్కునే!

౩౬

ఇదియొక యద్భుతంబగు పరీక్షయె కావలెఁ గాని చోఁ బ్రజా
భ్యుదయమె కోరి శాశ్వతమహోన్నత పీఠము నెక్కి ధర్మసం
పద వెదఁజల్లు దీనజనబాంధవు నిట్టి కిరాతు చేతి కి
చ్చెదవె హరీ! ప్రపంచమిఁకఁ జెడ్పడిపోవదె చూచుచుండఁగా!

౩౭

మచ్చరమెక్కి లోకము సమస్తముదూఁకి పిరంగిగుండ్ల కా
ర్చిచ్చున కగ్గమై యొకవిశిష్టత కోల్పడి పోవునాఁడు నీ
సచ్చరితంబె చక్కని ప్రశాంతియొనర్చి మహోపదేశముల్
ముచ్చటగాఁగ వింటిమిఁక ముందవి యెవ్వఁడొసంగు నిర్వ్యథిన్

౩౮

గురువారంబున నేదొసందియము నీకుందోఁచియున్నప్పు డా
పరమేశున్ నుతియించినాఁడవఁట; మా 'ప్రారబ్ధ'మిమ్మాడ్కిఁ
దొం
దఱగా దుష్ఫలితంబు నిచ్చునని తత్త్వంబింత గుర్తించుపై
ఖరి మాకెక్కడిదయ్యె! యియ్యది పరీక్షాభాగమే యందుమా!

౩౯

ఆరామయ్యకు భక్తుఁడై వెలయుమాత్యాగయ్య యేనాఁడు నో
రారన్ బాడుచు నాపరాత్పరునిలో నైక్యంబుగాఁ జేరెనో—
యారోజేయిది 'పుష్యపంచమి'—కటా! యావత్ప్రపంచంబుదుః
ఖారావంబుల దగ్ధమాయె మహితాత్మా! నీవు లేకుండుటన్

౪౦

వెనుక మహాప్రవక్తయు వివేకియునై జగమెల్ల దివ్యవ
ర్తనమున మేలుకొల్పినయుదారచరిత్రుఁడు 'క్రైస్తు' స్వర్గముం
గనినది శుక్రవారమునఁగాదె! మహాత్ముఁడు నైత మద్దినం
బున నవతారమున్ విడువఁబూనుటలో నొకయర్థముండునా!

౪౧

సరిగా వేవెలుఁ గస్తమించు తఱిలో సాయంతనప్రార్థనం
బరయన్ వచ్చెడివేళ నిట్టిమరణం బా బాపుజీ! నీకు ? దు
ర్భరమైపోయెఁ దదీయదృశ్యమున దౌర్భాగ్యంబువిన్నంత—న
ద్దిర! యెట్లుండెనొ? సన్నిధానమున నాతీవ్రత్వమేచూడఁగా!!

౪౨

నిలువునఁగాల్చివైవ నవనిం బడి 'రామహరే' యటంచు ని
ర్మలహృదయంబుతో నొకనమస్కృతితోఁ గనుపించెఁగాని కొం
దలమనుమాట లేశమయినన్ వినరాదఁట; వానిమూర్తిలో
వెలసినయీశ్వరాంశ కొక వెల్గును గాకమఱొండు కల్గునా!!

౪౩

ఏ సిద్ధాంతముకోసమై యహరహం బేకాగ్రచిత్తున్ జపో
వ్యాసంగంబు లొనర్చినాఁడవో మహాత్మా! దానివైరూప్యమే
గాసింగూర్చెను నీకు భౌతికముగాఁ; గానిమ్ము-తత్కర్మమే
యీసాసల్ తెగఁ బ్రాఁకిసత్ఫలము నేయందింపదో చూడుమా!!

౪౪

అనఁగా నాత్మసమర్పణంబిది: పృథివ్యాకాశముల్ నిండి వే
దనలో నక్షరమక్షరం బొక మహాధర్మంబు రూపించి మిం
చినయుద్బోధ మొనర్చె; దానినయినన్ జిత్తంబులో నొయ్యనో
యుర్వినహా త్తించియు వెల్గుచూచుకొన లేదా మూఢలోకంబిఁకన్

౪౫

అవతారంబులవన్నియున్ వివిధదివ్యాంశంబులన్ నాఁటికిం
పవృత్తోవన్ బ్రకటించి యందల్లి విశిష్టాకారమే నిత్యకృ
త్యవిధానంబులలీనమై పరఁగున ట్లత్యంతదీక్షావిధిన్
మిమ్ములన్ జూపఁగలేదె! దానివిలువన్ గీర్తింపరే తజ్జ్ఞులున్

౪౬

ఒకయంశంబొకనాఁడు ముఖ్యతమమైయున్నమ్మత్తలోకంబు నై
తికసూత్రంబులు సంస్కరించు నదియే దివ్యంబుగా—'గీత'గా
సకలంబులన్ పరిదిద్దఁగాఁగలిగి విజ్ఞానంబు బోధించి జా
తికి శ్రేయంబొనరించు; విశ్వమునుసృష్టిన్ గాంచుసర్వాత్మనా

౪౭

ఓయీ మోహనమూర్తి! నిర్మోక మహాయోగీంద్రుఁగా లోకర
క్షాయోధాగ్రణిఁగా సమస్తభువనశాంతిప్రబోధాత్ముఁగా
నాయా దేశము లన్ని యెన్నె నెపుడో:యా నీ చరిత్రంబు మా
ధ్యేయంబై యొక వేదమై యమితభక్తిం గూర్పదే జాతికిన్!

౪౮

వ్రాయక పోదు లోక మొకవంకఁ బ్రబంధముగాఁగ భారతా
మ్నాయము దీటుగా సకలమానవజాతికి బాలశిక్షగా
ధ్యేయముగా భవత్కథలు దివ్యమనోహరతత్త్వదృష్టిలో
నాయె నదెన్నఁడో;భువనమంతయు గానము చేసియుండదే!!

౪౯

నీ కఠినవ్రతంబు లవనిం గుఱుతింపనివారు లేరు ధ
ర్మైకపథావలంబివని యందురు లోకులు నిన్ను దోసమే
సోఁకని సైఁపఁజాలని విశుద్ధమనస్కుఁడవయ్య నీవు భూ
లోకము నుద్ధరించిన యలోకమహోన్నతమూర్తి వింతకున్

౫౦

ఎనుబది యేండ్ల వృద్ధు నెవఁడేనియు నొద్దిక ముద్దుముద్దుగాఁ
గనుఁగొని పూజ చేసి తన కన్నుల కద్దుకొనంగ నోఁచునీ
జనపదమందు నయ్యది యసత్యము చేసి యెవం డభాగ్యుఁ డీ
ఘనతకు సిద్ధమయ్యె నిఁకఁ బాపము పండెనొ యేమొ భూమిలో!

౫౧

పండినజ్ఞానముం గమియఁబండిన స్వానుభవంబు ప్రేమతో
నిండిన చూపులున్ వెలయు నీమహనీయమనోజ్ఞమూర్తి లే
కుండిన లోకమెట్టు లిఁకనుండును? సర్వవిధాల నీవు పూ
జ్యుండవు నీ పవిత్ర హృదయోన్నతి లోక మెఱింగియుండదే!

౫౨

క్రుంగెడు నేల నాల్గుచెఱఁగుల్ — మహనీయునిఘోరవార్త వి
న్నం గరుపాఱి మేనులు వణంకెఁ:గనారిలి పాటుతప్పి యు
ప్పొంగిన వేదనన్ గుమిలిపోయెను బుద్ధులు; మాకుదిక్కుచూ
పంగల నాథుఁడెవ్వఁ డిఁకఁ బాపము పండియు బ్రద్దలయ్యెనా

౫౩

నాలుగుమోములన్ నిగమనాదము లుప్పతిలంగ లోకముల్
లీలగ సృష్టిచేసి యవలీలగ మోసెడి యా విధాత యిం
కేల జగమ్ము మలుంచెనో హరీ! యిఁక నెట్టులు సైఁతుమయ్య! రాఁ
డేల సమస్తమట్టె సమయించుట కా హరుఁడైన నియ్యెడన్?

౫౪

తెలుగని ప్రేమయున్ బలువిధాలఁ దరంగతరంగలీలలన్
బఱపి మహాత్మ! యాప్తుఁడగుబంధువవో హితమ్ము సూపియుం
దఱిసెను దల్లిదండ్రుల విధంబయి మెచ్చునుగూర్చ నీవు గా
పఱి కనరావటన్న నొకఁడైనను నమ్మనె యిమ్మహీస్థలిన్

౫౫

అనయం బీజగమెల్ల ముక్తిగని సౌఖ్యంబొందఁగాఁ జూచు స
న్మునివేగాదు మహాత్మ! ధర్మగతులన్ బోధించు రాజర్షి - వె
వ్వనికిన్ దీక్షని సంశయమ్ములను విధ్వస్తమ్ముగాఁ జేయువా
నిని దీర్పంగల జ్ఞాని; నియ్యవనిలో నీ కల్మి సామాన్యమే!

౫౬

నవనీతంబునుబోని నీ యెడఁదలోనన్ లోఁతుగాఁ బాఁతుకొ
న్న విశిష్టంబగు పారమార్థికపు విజ్ఞానంబు రూపొంది మా
నవలోకంబున స్వేచ్ఛమై వెలయు నానారూపభావప్రపం
చవిచిత్రంబులు కత్తిరించి మదికిన్ స్వాస్థ్యంబు చేకూర్పదే!

౫౭

కలఁతల్ స్రుక్కెడి స్వీయదేశమతముల్ గాపాడఁగాఁ దగ్గ వి
ద్యలు బోధించితి వందులోఁ దగినవిద్వాంసుల్ మహాభక్తవ
ర్యులు త్యాగైకపరాయణుల్ వెలసియారూపంబులోఁ ద్రోవలో
ఫలితం బందియు లాఁతివారలకు నా భాగ్యంబు నందింపరే!

౫౮

యమునాతీరము రాజఘట్టము మహాత్మా! నీకు విశ్రాంతి ని
చ్చు మహాభాగ్యము నోఁచెనా! యెవరికై శోధించి విజ్ఞానభి
క్షు మహాశ్రద్ధగ నింతకాల మొసఁగంగా నుంటివో యట్టి వ
ర్గమె నిన్ బొట్టనుబెట్టుకొన్న—నిఁక దుర్మార్గంబు వేఱుండునా!

౫౯

జాతికిజాతికిన్ విషము చాఁదిన వర్ణవిభాగభూతమున్
బ్రేతముఁజేసి—దాని విషబీజము దవ్వులఁ బాఱవైచి యా
పాతమనోజ్ఞమై కుటిలభావములన్ సమకూర్చియున్న యా
తాతలనాఁటి సాంఘికవిధానము పెల్లగిలంగఁ గూల్పవా!

౬౦

కేవలరాజకీయములకే తన జీవిత మర్పణంబుగాఁ
బోవక యాత్మశుద్ధిపరిపూర్ణతకై కఠినవ్రతంబు లె
న్నో వివరించి చూపితి వహో! నినువంటి మహాత్ము నేడఁగా
నీ వెలయంగఁ జూతుమె మహిన్ జిరకాలమునుండి యేనియున్

౬౧

ఎవఁడో మూర్ఖుఁడు పైఁగ హైందవుఁడ నంచే దేదియో కూసి గౌ
రవహీనుండయి యిట్టిసాహసము దౌరాత్మ్యంబు చూపించెనా!
అవురా! యల్లరిమూఁకలై మతములో నన్యాయ్యముల్ బొన్పి ధ
ర్మవిరోధంబులొనర్చి సాధుజనమున్ భ్రమందింపఁగాఁ జూతుమా!

౬౨

శివశివ! యిట్టిచేష్టలు విశేషముగా నొకరూపు నెంది మా
నవులకు జాడ్యమై పరఁగెనా! యికఁ దప్పదు ముప్పు; పైఁగ—గౌ
రవమును గూలి దానను బరంపరగాఁ దన జాతిజాతి యు
క్కి—వమయిపోయి గూపఱి వికీర్ణత నెందియుఁ గుందిభ్రమందదో!

౭౩

పశుబల మిట్లు పెల్లుబికి భారతవర్షము నెత్తికెక్కి దు
ర్యశమును గట్టిపెట్టి తుదికారట మిట్టులు గూర్చునే! యహా
ర్నిశ మొక యోఁబదేండ్లుగ విరించియు వ్రాలె సృజించి దేశమీ
దశకును దెచ్చి ఘోరఫలితం బిటులందితివయ్య బాపుజీ!

౭౪

మాయనిమచ్చ యాయెనుసుమా! నవభారతజాతికెల్ల నీ
గాయము మాన్పఁగాఁగల మగల్ గలరే! భువిలో విషాదమై
పోయె;సమస్తమానవులబుద్ధి పరీక్షయొనర్చు నా యుపా
ధ్యాయుఁడు దేవుఁడేతలఁ చెనాయిటు సేయఁగఁగోరియియ్యెడన్

౭౫

ఆఱనిమంట—దీనియుడు కాఱుట యెన్నఁడు లేదు:పైఁగ నిం
డారఁగఁ బాఱి యొక్కట మహార్ణవమై భువినెల్ల ముంచు క
న్నీరును జాలదోటు! గమనింపఁగ—నార్చెడివారు బొత్తిగా
లేరని చెప్పవచ్చును బలే! విధి చేసినదాని మార్తురే!!

౭౬

నాఁటి పరాభవానలమునన్ మతిపోయిన ప్రాణి చేష్ట లీ
నాఁటికిఁ గన్నులంబడె '*వినాయకుఁ' డట్లువినాయకుండుగా
నౌటనుగాదె యివ్విధి ననర్థము లెన్నియొ తెచ్చి లోక మా
రాటముఁబొంది యుండఁగ దురాగతముల్ బచరించె నక్కటా!

* వినాయక గాడ్సేగాఁడు

౭౭

భువనములన్ని యట్టుడికిపోయె! మహావిపదంబురాశిలోఁ
దవిలి మునుంగుచుండఁ బ్రతివిధానములన్ నడపింపలేక యీ
యవసరమందు దిక్కుదెస నారయుచున్నది మూఢలోక; మి
ట్లవునని యెన్నఁడేనిఁ గలనైనఁ దలంచియు వేచియుంటిమా!

౭౮

కలియుగధర్మమంచు గతకాలము మేలని యెంచి మూఢులై
పలికెడి సంశయాత్ముల స్వభావ మెఱింగియు జాతినీతి సం
కులతను బాపి యీ జనులకున్ హితమార్గము బోధచేసి యా
వల నొకదారి చూపితివి బాపుజి! నీవిఁకఁ గానరావొకో!!

౭౯

ధరఁ గలుషంబు వాప నవతారము దాల్చినదైవ మిట్టు ల
క్కఱయగునంతవట్టును వికస్వరనిర్మలనిర్వికార భా
స్వరుఁడయి సంచరించియు ప్రశాంతిని బొందెనొ యేమొగాని యు
త్పత్తి నెటుస్సైఁపవచ్చును! వృథా మనజన్మములన్ని యెన్నఁగా

౮౦

అనుకొనినంతకంటెను మహాత్ముఁడవయ్యు మహాత్మ! బుద్ధిలో
ననుకొనుమాట చెప్పను సమర్థుఁడ వాపయిఁ దాని నవ్విధిన్
బనిపడి చేయఁగాఁగల ప్రభావము నీయది; దానిఁబట్టి కా
దన రెవరైన-నీవనిన దంతయు నేకొని తీఱగావలెన్ !!

౭౧

మతమున్ దేశమునో మఱఁగాఁగలమహామాత్ముండుపూజ్యుండు శా
శ్వతకల్యాణముగూర్చిమానవులకున్ స్వారాజ్యసామ్రాజ్యస
ద్గతి నిశ్శంకముగా నొసంగునని లోకంబెల్ల నుత్సాహసం
భృతమై వేచియుండె దానిఫల మాభీలంబుగా మాఱెనా !

౭౨

ఆలము దీఱిపోయె జయమన్నది భారతజాతి దక్కె నిం
కేల నిరాశ! సర్వజన మీఋషిపుంగవు దివ్యబోధ లు
ద్వేలముగా వినంగను బదింబదివాగమృతంబుగ్రోల రా
రేల యటంచు నుచ్చదశ నిచ్చియు నిట్టులొనర్తువే ప్రభూ !!

౭3

ఇఁక నెంతేననుకూలకాలము—తటాయింపంగ సాధ్యమ్ముగా
దుకదా బ్రహ్మకునైన: దేశమున కేదోగొప్ప మోక్షంబు చూ
పకపోవంచుఁ దలంచి యూఱడిలి యాభాగ్యంబుకై పెద్దపూ
నికతో వేచియుండఁగాఁ దుదికి దానిన్ రిత్తగాఁ జేయుదే !!

౭౪

పలపల కంటినీ రురలిపాఱఁగ భారతమాతృదేవి యు
గ్గలమగు రోదనంబునఁ బొకారిలిపోయెడినాఁడు నీవు నె
చ్చెలివయియాదరించియుఁ గృశించినయామెకునూర్పుపోసి యా
వల నిదియేమి కష్టములపాలొనరించితివయ్య వెండియున్ !!

౭౫

ఎదిగెడి మాతృదేశమున కేదొ౯జవంబును దెచ్చి ప్రాణముల్
కుదురుగఁజేసి దాని కనుకూలవిధానము లొ౯ర్మినైఁ బదిం
బది సమకూర్చి సర్వము శుభంబుగఁ దీర్పఁగనున్న వేళ ని
య్యది యెదురయ్యె దీని ఫలమక్కట! యెట్టులుకానవచ్చునో

౭౬

చాలినయంతవట్టు తన సాహసవిక్రమసత్త్వదీప్తు లు
ద్వేలముగా వెలార్చి యొకవిజ్ఞత సభ్యతఁ గూర్చి దేశదే
శాలు జొహారుసేయఁగ విశాంపతు లెల్లరు మ్రొక్కరింప ని
ర్వేలుపులోలె సర్వపృథివీతలమందును బూజలందవే!!

౭౭

మొన్ననె జన్మభూమి కొకముఖ్యసమస్య పొకాలి వాదముల్
గొన్న విధాన మొక్క యనుకూలపరిస్థితి పట్టుదాఁక నీ
వన్నము సైత మంటుకొనవైతివహో! యది పెద్ద యస్త్రమై
బన్నము తీర్చివైచి యశుభంబులుమాన్పనటంచుఁ బొంగనే!!

౭౮

చిరకాలంబుగ నీవు మృత్యువును ‘కస్తీ’ పట్టి మీామీా బలం
బరయన్ లోకముప్రోలఁ జూపితిరిగాదా గాంధిజీ! యేదియౌ
త్తరి నేమైననునూనె నీవొకఁడ వీ ధాత్రీతలంబందు ను
త్తరువీయంగ నెవండు కాదనుచు ‘హుండా’ చూపఁగా లేడిఁకన్

౭౯

మతమనుదానిలోఁ గఱకుమూర్ఖ మడంచి పవిత్రభావముల్
బితుకుచుఁ బారమార్థికవివేకము ప్రోదియొనర్చి ప్రేమసం
యుతమగు విశ్వమానవసహోదరభావము నేర్పి ప్రాచ్యసం
స్కృతి మొదలంటఁ దెచ్చియు విశిష్టత గూర్చితివయ్య బాపూజీ!

౮౦

ఈ కొఱగానిదేశమున కింక మహాత్ములు పుట్టఁబోరు—లో
కైకమహాత్ము దాఁచుకొనరైరిగదా! యొక యాతతాయి చీ
కాకయి దేశగౌరవము గాలనురాచి, మతంబులోన ము
క్కాకలు దీఱియున్న మొనగానిని గ్రుక్కటఁబట్టి త్రింగెనా!

౮౧

కడచెను లెక్కలేని కడగండ్లు: స్వతంత్రత యన్న భావ మె
క్కడ లవలేశమేనిఁ గలికంబునకేని యెఱుంగలేని యీ
య్యడవిమొకాల కొయ్యన భయంబును బాపి గుణంబు దెచ్చియు
య్యెడుమ లడంచి కీర్తి గడియింపఁగ నేర్పితివయ్య బాపూజీ!

౮౨

తీఱనిసంద్రదీక్షన్ మునిఁగి తేలుచు నుండియు నిత్యకృత్యముల్
మీఱని దివ్యమూర్తివి సుమీ! నిలువెల్ల దయారసంబు నిం
డారఁగఁ గానవచ్చెడి మహాపురుషుండవు నిన్నుఁబోలువా
రారయ లేరు—లేరు మహితాత్ముఁడు బుద్ధుఁడు దక్క నిర్ధరన్

౮౩

ఆయనె జన్మమెత్తి యిటులయ్యె నటంచుఁ బ్రపంచమెల్ల నో
హో! యని పెద్దసంబరము లొందియు బ్రహ్మరథంబుఁబట్టెదీ
ర్ఘాయువు గల్గి యీతఁ డనయంబు జగంబున కూర్పుచోసి భ
ద్రాయితమూర్తి యౌనని గదా మనమెంచితి మింతకాలమున్!

౮౪

కులములుగోత్రముల్-బలిగఁ గోసి యణంచిన నిమ్నజాతిలో
వెలసిన జాడ్యమున్ దివిచి విజ్ఞత గూరిచి వింతశక్తి కా
వలసిన దిచ్చి యీ భరతవర్షమువైభవ మెల్లఁ బెల్లుగా
నిలుపఁగడంగినట్టి మహనీయుఁడు నేఁడిక లేఁడు చూడఁగన్!

౮౫

త్రికరణశుద్ధియన్న దొక దివ్యగుణంబని శాస్త్రమన్నదా
నికి భువిలో నిదర్శనము నీవెగదా మహనీయ! నీదు శ
క్తికి జగమెల్ల లోనగు నుతించినదన్న విచిత్ర మున్న దే
యిఁకఁ గనరానిమూర్తివయి యేమి ప్రబోధ మొనర్చుచుం
[డుహో!

౮౬

అకలుష దేశభక్తిభరితాత్మకు లెందఱో గోరి నీదు ప్రా
పకమునఁ జేరి రాజ్యపరిపాలన సేయఁగడంగినారు వా
రికిఁ దగు రీతి మేలనుసరింపుచు దోసములున్న దిద్ది జా
తికి గతిఁ జూపుచుందువుగదే! యని పొంగితిమయ్య బాపుజీ!

౮౭

జలనిధిమంథనంబునఁ బ్రశస్తఫలంబది దక్కఁ బోవుముం
దొలసిన కాలకూటమది యారకపోయెనె! నేఁటి యీ మహా
విలయము దానివంటిది! వివేక మెఱుంగని మ్లేచ్ఛజాతి కో
ర్కులు తుదికిట్టు దేశమును గూల్చె నధోగతిలోన ముంచియున్

౮౮

ఒకయమృతంబు దక్కెనని యోపిక చూపినవారు వేఱు; ప్రా
పకమున మాకు భాగమని పంచుకొనంగఁ దలంచి పెద్దగాఁ
దికమక గూర్చి దానిని బదింబదిఁ బ్రోదియొనర్చి యెల్లవా
రికిఁ గడగండ్లు తెచ్చిరి హారీ! మఱికొందఱు దుర్మదాంధులై

౮౯

చీటికిమాటికిన్ గలుషచిత్తము హత్తియు రచ్చకెక్కి జం
జాటము తెచ్చిపెట్టఁగల జాతిని నీతికిబోధచేసి యీ
రాటము తీర్చి స్వాస్థ్యము స్థిరంబుగఁ గూర్పఁగఁ బ్రాణమొడ్డి పో
రాట మడంపఁ బూనెడి మహాత్ముఁడు లేఁడిఁకఁ బాడుభూమిలో

౯౦

సయమును—మాటనేర్పరితనంబును—రెండవవానియందుఁ బ్ర
త్యయమును లేక— సభ్యత సమన్వయబుద్ధి యెఱుంగలేక ని
శ్చయమని తాను నమ్మినది చచ్చినదాఁకను మార్చుకోని దు
ర్నయు పరులన్ శ్రమంపడి ఘనంబునఁ బెట్టితివయ్య బాపూజీ!

౧

కఱకుమతాభిమానమున గంతులువైచెడి కోఁతిమూఁక ల
క్కఱయగునాఁడు తోడ్పడరుగాదె! యదాటునఁ బెత్తనంబుచే
పట్టినఁ బ్రమాదమేయగును–గొందల మందును లోకమెల్ల న
త్తఱి నెవరేమి సెప్పిన వృథాయగు–నియ్యది నీవెఱుంగవే!

౨

ఎఱిఁగియె రేఁబవళ్లు శ్రమమేదియుఁ జూడక కాలిబాటలోఁ
దిరిగితివయ్య దిక్కుదెస తేలని యా 'నవఖాళి'లోఁ బరా
త్పరుఁ డిటువచ్చెనే యని యభాగ్యులు నీమహిమం బెఱింగి సం
బరపడి మూఁగి;రా కథలు భారతగాథలుగావె మా కిఁకన్!!

౩

పరిణతసత్త్వులైన మునివర్యులు సైత మెఱుంగలేని య
బ్బురములు రాజకీయములుఁ బూర్తిగ నీ యఱచేతిలోనివై
తిరిగినవయ్య: యెవ్వరు నెదిర్చినవారలె లేరు నిన్ను సం
దఱు నొకయోగిగా ననుదినంబు గణించి నుతించి కొల్వరే!!

౪

తీరికచిక్క నల్గడలఁ దివ్యుని నీయమృతంపుమాట ల
వ్వారిగ వించు నప్పరమభాగవతోత్తములన్ స్మరింపఁగా
నేరుతు మంచు సర్వధరణీతలమండలివారు నిచ్చలున్
గోరుచునుండ–నిట్లు ప్రతికూలముగా విధి యెంచి త్రుంచెనా!

౯౫

మాకున్ జిక్కులుదెచ్చునీ యవనసామ్రాజ్యంపుసంపర్కమే
లా కోరందగునంచు హైంవవులలో నాగుబ్బుగా నేడ్చి కా
ఱాకుల్ మేయుచుఁ బ్రాణమానధనవిఖ్యాతుల్ వృథాపోయియ
ట్లాకన్ గుందుచు ప్రమంది రెందఱో మహాత్మా! నీవువీక్షింపవే!

౯౬

ఓర్చితి మింతకాల మదియున్ బలహీనతగాఁ, దలంపఁగా
నేర్చియు లాఁతిజాతు లోకనీతియు రీతియు లేక పోరులం
గూర్చుచునుండ నెయ్య మొనఁగూర్చుచు దీక్షవహించి యి [క్కటుల్
తీర్చియు నిందునందుఁగల తీర్పులు దిద్దుట కెవ్వ రుందురో!

౯౭

ఆవుల లేఁగలన్ గుతుకమారఁగ నిచ్చలుఁ గోయుజాతి నిం
కేవిధి మార్తు? రందలి యనిష్టము తీర్పనుజాలువార లే
రీ వసుధాతలంబున విధీ! తుది కిట్టులొనర్చినాఁడ వ
య్యా వెరవేది మాకుఁ? గనుమా నవభారతదుర్విపాకమున్

౯౮

మతమున్ దేశము నొక్కకంటఁ గని సంభావించి సార్వత్రికో
న్నతి చేకూర్చితివయ్య: భావిపరకాంతర్యంబుఁ గన్నారఁ జూ
చితిమయ్యా! యిఁక నీ ప్రబోధమున సుశ్రీలందియీజాతి ధ
న్యతమంబై వెలుఁగొందునే యని మహాత్మా! యెంతు మ [త్యంతమై

౯౯

హైందవధర్మమన్నది నిరాశ్రయమై సవకంబు వోయి వి
స్పందితమయ్యెః దానికొకపాదును ద్రవ్వియుఁ దేజువోసి ని
ర్బంధము లూడ్చివైచితివి భాగ్యము పండెను భారతీయు లు
ర్వీందలయెత్తియెందు విహరింపఁగఁజాలుదు రంచు నెంచవో!

౧౦౦

మనసులుగల్పి యొండొరులమాటలలో నొక చెల్మిఁగూర్చి మేఁ
కను బులిపజ్జ నుంచియు వికారము కల్గనిరీతి నేర్పి శాం
తిని గడుబోధచేసి యొకతీరు వెలార్చితివయ్యః దానిఁ గా
దనరు మహాత్మ!యందుఁ బరమార్థమెఱింగిన యెవ్వరేనియున్

౧౦౧

అదియొక సాకుగాఁగొని మహాత్మ! మతాంధులు విఱ్ఱవీఁగి దు
ర్మదమునఁ బిచ్చటిల్లిరి సుమా! నిను నమ్మిననారి కాపడల్
పొడలిన సైఁచుమటే తగిన బుద్ధిగ నేర్పితివయ్య దానిచే
మొదటికి మోసమేర్పఱుపఁబూనిరి మూఢులు కొందఱిమ్మహిన్

౧౦౨

చదువులు సంధ్య లేర్పఱుపఁ జాలని సాధుపథంబు సర్వథా
కుదురుగఁజేసి దాని కనుకూలపరిస్థితిఁ గూర్చినాఁడ వి
య్యదనున నిన్నుఁజూచుకొని యుబ్బరమందుచుఁ బెద్దసంబరం
బొదవఁగ నున్నవేళ విధి యోర్వక పోయె నదేమి పాపమో!

౧౦౩

ఆ దుర్మార్గుని దుశ్చరిత్రము మహాత్మా! నీ చరిత్రంబులో
నేదో రూపునఁ దెచ్చిపెట్టుటకు నా కిష్టంబు లేదైన—ని
న్నెమ్మదిన్ గాథలుత్రవ్వఁగా నిదియు నీ మేలే సుమా యందు నీ
బాధల్ తీఱెఁ బరాత్పరుం గలసి శశ్వత్సౌఖ్యముం బొందవే!

౧౦౪

చలిచీమంబొలియింప నేరని యహింసామూర్తినిం జంపఁగాఁ
గలధీరుల్ జనియించి రీభువిని దౌర్గత్యంబు మాయింపఁగాఁ
గల పుణ్యాత్ములు లేరిఁకన్ మఱియు నీ కాలుష్య మేపారి దు
ష్ఫలముల్ బెల్లుగ సంటఁగట్టియు మనస్తాపంబు గావింపదో !

౧౦౫

వెనుక యజాతశత్రుఁడు కవించి విరాటుని కొల్వులో నిజం
బును వచియింపఁగా నృపుఁడు బుస్సునఁ బాచికపట్టికొట్టఁ జి
వ్వున నెసరేఁగె నెత్తురది భూమికిఁ బాఱఁగనీక దూరదృ
ష్టిని సరిపెట్టె ద్రౌపది; యుసీ! యిది యట్టిదిగాదు చూడఁగా!

౧౦౬

ఒక కీలాలకణంబుగాదు-మది కేదో నెత్రుటేఱై భయా
నకమై నివ్వెఱగొల్పఁ బ్రాంగణములో నన్నాఁటి తద్దృశ్యమిం,
తకు దేశమ్మున కేమి సేయుదు మహాత్మా! క్షామమే పుట్టియూ
రక పోనిచ్చునె! రేఁగి నల్గడల హాహాకారిగా క్రమ్మంగదే!!

౧౦౭

పూవులలోన పూజసలుపున్ జగమెల్ల మహాత్ముఁడన్న-మా
యావుల కేలయిట్టి దనయంబుగఁ దోఁపకపోయె! దైవమా
యావిపరీతవృత్తియె యనర్థముగా నిటు తెచ్చిపెట్టెనా?
లేవిఁక సద్గతుల్-విలువ లేదిఁక భారతభూతధాత్రికిన్

౧౦౮

ఈ రాజ్యంబిటులిచ్చి యేల్బడియు మీదే యంచు స్వార్థైకలా
భాఘూఢంబగు నుద్యమంబు మొదలే యానంతయుంజూప; వీ
డారిం బొండనిమాత్ర మందువు మనస్తాపంబు గల్గింపవే
లా రక్షోగణ మిట్లొనర్చె? విధిలీలల్ దాఁటఁగాసాధ్యమే !!

౧౦౯

వాదరదీరియున్న పరివారము కొందఱు కుట్రవన్ని స
ర్వాదరణీయమూర్తియు మహాత్ముఁడునై వెలుఁగొందువా
[ ని-దు
ర్బోధలుసేయు మానిసిగ రోసి వధించుట కేది కారణం
బో దయచేసి తెల్పవె యహోమయమాయెఁబ్రపంచమే ప్రభూ

౧౧౦

తల్లియుఁదండ్రియున్ మది వ్యథంబడఁ ఘాతకకృత్యమేలరా !
యల్లరిపుట్టురా! యని భయంపడి కాళ్లకుమ్రొక్కిరంట; యా
ప్రల్లదుఁడైన పుత్త్రుఁడు కృపారస మించుకలేనినీచుఁడై
యెల్లరి కిట్టిగుండెదిగులే యొదవించెఁ గిరాతవృత్తిమై

౧౧౧

దానికి 'లాటరీ' యఁట విధానము: భూసుర వంశ్యుఁడైన యీ
మానిసి వంతువచ్చెనఁట; మారణహోమ మొనర్ప యజ్వయై
పూనియు నిట్లుచేసె నఁట- బుద్ధివిహీనుఁడు ఘోరపాపి యే
పూనో కదా; కులంబుమరి మోదకుస్వస్తియుఁ జెప్పె నేఁటితో

౧౧౨

వీని దురాకృతంబున వివేకు లనేకులు దేశమందుఁ బా
పాన మునింగిపోమ్ము తెగ బాఁదుకొనంగఁ దటస్థమయ్యెఁ గో
పానఁ బవిత్రమూర్తులను బాపము! బందెలవైచి, రిట్టి సం
తానము దెల్ల నిట్టి యవతారసమాప్తికి మూల మాయెనా !!

౧౧౩

వేలకొలందిగాఁ బ్రజ,తపించి-మహాత్ముని బొట్టఁబెట్టుకో
నేల యటంచు గ్రుడ్లుఋమి యింతలు చేసిన'వాంధ్ర'జీవ మిం
కేలయటంచు రేఁగి పొలియింతుముహంతకునంచుఁ గ్రోధమా
భీలముగాఁ జరించియు శపించియు స్రుక్కియు సోలి రెల్లెడన్

౧౧౪

మృత్యువు బ్రాహ్మణాకృతి వరించియు వచ్చెనొ యేమొ! [కానినాఁ
డత్యలఘుండు శాంతిమయుఁ డద్భుతమూర్తియె కన్నుమూ [యునా!
నిత్యము లోకమందిఁకఁ గనిష్ఠికకెక్కిన కీర్తి యిచ్చి దా
ర్గత్యము మాన్పఁగాఁగలుగుజ్ఞాని యెవండు కలండుచూడఁగా

౧౧౫

దేశము కంటకస్థితికిఁ దెచ్చిన "డయ్యరు" నంటి వట్టి దు
ష్టాశయునే యెఱింగె జగమంతయు నింతకు—వానిమించి యీ
దేశములోనె పుట్టి గుణుతింపఁగ నొక్కఁడు బ్రాహ్మణబ్రువుం
డీశ! యిదేమికర్మ మిదియిట్టిది యాటయె నీకు నిష్టమా!

౧౧౬

ప్రల్లదుఁడైన యొక్కఁడు కులపాంసను చేష్టలఁ జేసి తప్పులఁగ
బెల్లను దోషజుష్టమగు టేమియు వింతయుఁగాదుగాని యీ
యల్లరి కేదిమూల మది యైన నెఱింగియుఁ దత్తచిత్తులై
యెల్లరు బుద్ధి తెచ్చుకొను టే యొక నిష్కృతి జాతికంతకున్

౧౧౭

ఈ విపరీతకాలమున—ఈ లోకసంఘములోని* పెద్దలు
య్యో! విధి యిట్లు చేసెనని యొక్కవిచారమునైనఁ జూపఁగాఁ
బోవరు దానికేమి పలుమూలల ఖండముఖండ మొక్కఁడే
త్రోవను బోయె రోదనముతో మది నెవ్వగఁ గూరి యియ్యెడన్

౧౧౮

కత్తులుపట్టి నెత్తుటులు కాల్వలు వాఱిచి శాంతిదేవతన్
గుత్తుకకోత్తి దేశమునకున్ బెడఁదల్ గుడిసింపఁ జేసెనా!
చిత్తము నెత్తి లోకుల విభేదము ఘూర్ణ్పఁగడంగి యుందుఁ—బై
పెత్తన మేదియైన నొకపీసముగాని వెలార్పఁ జూచెనా!

*మహాచార్యులు

౧౧౯

మొదలు-మహాత్ముం డాపయిని మోక్షముచూపియు దేశదా
[స్యమున్
బ్రిదులంగఁ జేసినట్టి యొకవీరుఁడు-వృద్ధుఁ డు-జ్ఞానసేచికల్
గుదురుగఁ జేసికొన్న యనఘుండు; పరాత్పర! యిట్టివాని బె
ట్టిదముగఁ గాల్చినీచుఁడు గడించినలాభము ఘోరపాపమే

౧౨౦

వెనుక వివేకమున్ దొఱఁగి విజ్ఞుల బౌద్ధులఁ గాలరాచి పై
కొనుతమకంబుతో నెదిరిగోడు నెఱుంగక హైందవంబు చే
సెను గడుఘోరహత్యలు; విశేషముగా నవియే యనంతరం
బనయము గూర్చెజాతి: కిదియంతయు నూరక పోవునా ప్రభూ!

౧౨౧

ఆ దోసంబునఁగాదె హైందవులలో నారాటముల్ పుట్టి పై
నేదో రూపున దాస్యశృంఖలముతో నీ నాఁటికిఁ బోక్షమే
లేదాయన్నటు లూఁగి తూఁగి తుదికిం గ్లేశంబు దీర్పంగ రా
వే దైవంబని కుంది; రట్టిదశలోనే యిట్టి దుష్కృత్యమా!!

౧౨౨

ఇప్పటి యీ ప్రయత్నమది యింతటఁబోవునె! దేశమెల్లఁ గ
న్విప్పియుఁ జూడదే! తగినవెజ్జు చికిత్సను జేయఁడే! మదిం
గప్పిన తామసంబును లుకాలుకలై యొకవింత జ్ఞానముం
దప్పక రాదె! దానికొక దారియుఁ గానఁగరాదె చూడమే!!

౧౨౩

జైనులబౌద్ధులన్ నణుకఁజాలిన జాతి మహాత్మ్య మిట్లు ఱం
పానను గోసెనన్నఁ బొరపాటునుగాదు - విశేషమేమియున్
గానము; గాని యీ యుసు రెకాయెకి రేఁగి సమస్త హైందవ
ప్రాణము లూఁచముట్టుగఁ గృపారహితంబుగ దోఁచి వేయదో!

౧౨౪

మతమున ద్వేషముంబొదివి మాయని గాయము సేసి దానిదుః
స్థితిగుఱుతింపలేని యొక దేశము చూపెడిచేష్ట లిట్టివై
వెతలనుగూర్చు: బానను విభిన్నత రూపము సెంది సర్వదు
ర్గతులకుఁ దావలంబయి వికావికలై యది కూలిపోవదో!

౧౨౫

మూరెఁడు ముందుసాగి కనుమూసినలోపల దేశమంతయున్
బారెఁడుపోయె వెన్కకు:నపాయమెగాని యుపాయ మేదియున్
దోరపు వేడిలో మదికిఁ దోఁపదు—సర్వవిధాల జ్ఞానభం
డారము రాలిపోయె నకటా! మనదుర్గతి యిట్టులయ్యెనా!

౧౨౬

మన కింతే గతి యంచు నూరుకొనిరా మన్నింపదే దేశమై
ననుగానీ: యొకనైన నిట్టియెడలన్ గాన్పించుచున్నట్టి కు
ళ్లును సాంతమ్ముగఁదోడి వేయవలె—ఆ లోపమ్ము రూపింపరా
దని తాటస్థ్యము చూపిరా నరకమే యాధారమై పోవదా!!

౧౨౭

అక్కసు దీర్పఁగా నెవనికైనను గత్తికటారులున్నవం
చుక్కన రేఁగి మీఁదఁబడు టొక్కవిధానమె! రాజకీయమే!
చక్కనిబాట యేర్పఱచి సాగియు రండని వ్రేలుసూపి నల్
దిక్కుల జ్ఞానదీపికలు దీర్చినవాఁడును జంపుకొందుమే!

౧౨౮

అదిగో! తూరుపుదిక్కునన్ వెలుఁగు దృశ్యంబయ్యె-నామీఁద న
య్యుదయంబున్ గనవచ్చునంచుమదిలోనుత్సాహ ముత్సేకమై
పొదలన్ రివ్వునఁ గాఱుచీఁకటులు సంపూర్ణంబుగాఁ గ్రమ్మి య
భ్యుదయంబున్ హతమార్చెఁ: శాప మదియే మోగాని యీజా
[తికిన్!

౧౨౯

పాయని ప్రేమ చూపి శిరపాయపథంబును నేర్పఁగా నుపా
ధ్యాయుఁడుగా మెలంగి యభయంబు జగంబె కుటుంబమంచునా
ప్యాయమువొందిముందడుగువైచుమహాత్మునిఁజంపుకొన్న యీ
గాయము మానునే యుగయుగాలకునైన ధరిత్రిలోపలన్!

౧౩౦

అనయము దేశభక్తిని సమంచితరీతిని నూఱిపోసి యూఁ
పున నొకయేఁబదేండ్లుగ నపూర్వమహోద్యమచిద్విలాసము
య్యాన నడపింపనేర్చిన మహాత్మునిబట్టి వధించుజాతి నే
మనఁగలదయ్య లోక! మదమూఱునె యెన్నఁటికేని మేదినిన్?

౧౩౧

తనయస్త్రంబు స్వరాజ్య మిచ్చెననియుం తన్ బోవ కామీఁద నే
ర్పున నింటఁగల దోషరాసులను సంపూర్ణంబుగాఁ గ త్తిరిం
పను సేయుం బవలోర్పు సూపుచు మహాభారంబు మోయం
గఁబూ
నినవానిం బొలియించుజాతి నెవఁడేనిన్ మెచ్చిప్రేమించునా!

౧౩౨

తలయెత్తంగలరే ప్రపంచమున నిందం గుందు నీ భారతీ
యులు? లోలోపల నున్నకుళ్లు మదిలోనూహింపఁగారాని చేఁ
తలలో దించిన దాని నెంచఁగలరే — తబ్బిబ్బులై పోదె భూ
తలమే! యింతకుదీనినిష్కృతియు లేదాస్వామి!లోకంబులో !!

౧౩౩

తనకన్నట్టి తనూజునే హరిహరీ! దాక్షిణ్యమే లేక చం
పిన యా వెంగలివిత్తుఁ జూచి కడకున్ బీభత్సుగాఁ గ్రుంగిపో
యిన యీ భారతమాతృగర్భమునకున్ హేరాళమై కానవ
చ్చిన శోకంబును దీర్చునాథుఁ డెవఁడిసీ! యింతదుర్మార్గమా!

౧౩౪

స్థూలశరీరమున్ గఱకు ధోరణిఁ గాల్చిన పిచ్చివాని కే
లా లభియించు మేలు!పదిలంబుగ నప్పుడె సూక్ష్మదేహ మా
బాలకు సర్వబుద్ధులకుఁ బట్టి మహాత్ముని మీఁది భావ ము
ద్వేలముగాఁ జెనంగొనె విధీ! యిది నీదు విచిత్రసృష్టియా !

౧౩౫

ఓవయ్యా! పదిమంది నాదుకొను నా పుణ్యాత్మ నీ వేళ యీ
త్రోవఁ రక్కసుచేతి కిచ్చితివి సంతోషమ్ము నీకయ్యెనా !
కావఁ బ్రోవను నీవెగావె! మఱిమాకాలుష్యముఁ సర్వముఁ
బోవఁ జేయవె! దారియేదో సరిగా బోధింపవే యిత్తఱిఁ!!

౧౩౬

ఇది మా పెద్దలబుద్ధి మార్పుదలకై యేదేదేదియో ప్రాచితం
బది నీ చేసినదంచు నెంచవలెనా! యీ ముక్క స్పష్టంబుగా
మదికిఁ వచ్చెడిరీతిఁ జెప్పవలదా ! మా జాతి సామాన్యమై
నది గాదయ్య:మహాత్మునే నఱకుకొన్నారన్న విడ్డూరమా !!

౧౩౭

కఱకఱఁగోసి కండలను గానుఁగవేసి, మతంబుపేర ము
ష్కరమగు త్రోవలో నడువఁగాఁ గనుసైగలుచేసి చూపి సం
బరపడుజాతి మాది;పొరపాటని వారికి బోధసేయ దు
ష్కరమగుకార్యమై ప్రళయకాలము సైతము తెచ్చిపెట్టదో!

౧౩౮

ఆ యంశంబది జీర్ణమై తరతరా లా భాగ్యమే పెద్ద యా
ప్యాయంబై గడిదేఱినట్టి తెగలో నాజాతిసంతానమి
ట్లాయెఁ జిత్రములేదుగాని జగమే యల్లాడు నీ దుష్కృతిం
జేయఁ బ్రాణము లెట్టులొప్పె ! నదియే చింతింతు మత్యంత

[ముఁ

౧౩౯

తనకన్నే తనవ్రేలువెట్టి యెవఁడో భ్రష్టుండు నష్టంబు చే
సినయన్నట్టులు లోకబాంధవుని హింసించెంగదా! దానికై
వనటం గూరిన లోక మిందఱును సంబాళింపఁగాఁ జేతనై
న నరుండెవ్వఁడొ చెప్పుమా యెచటనైనన్ గాని యిప్పట్టునన్

౧౪౦

ఉన్నదియూడ్చివైచుటయు నొక్క ఘనంబునుగాదు - లేని దే
మన్నను దెచ్చిపెట్టఁగలరయ్య! మహాత్ముని వంటి వ్యక్తి యిం
కెన్ని యుగాలకేనియు మహిం జనియించునె! పాప భూమి కా
మన్నన దక్కునే! కలుషమార్గము గూపఋమార్గ మున్నదే!

౧౪౧

లోకము రాజకీయమగు లోపముచే బెగడొందువేళ ధ
ర్మైకపథానువర్తియగు వ్యక్తి జనించును గాదె! వానికై
లోకులుచూతు: రట్టిస్థితిలో నిదియేమి దురాగతంబు నీ
వీ క్రియఁ జేసి యేటి కెదురీఁతయు నీఁదితివోయి సోదరా!

౧౪౨

నినుఁగ్రొండాడుదురాత్ము లెవ్వరయినన్ నీచేతలఁబూఁకొంచుమిం
చిన ప్రోత్సాహము సూపు పాపులయినన్ జిత్తంబులోనైన దీ
నిని నీచంబుగ నెంచరో! కరుణ లేనేలేదురా యన్న ధా
రణిలోఁ జూడరొ! యోరి! నీకాలము క్రౌర్యం బెట్టిదై పోయెరా!

౧౪౩

నలువకాలంబులోఁ బాడమినాఁడవురా ! ఎవరిట్టినీతులన్
గలిపినవిద్య నేర్పిరి జగాన ? నిన్నుం గని తల్లిదండ్రు లె
ట్టులు సుఖమందియుందురో! కడుంగడు నీచుఁడవైన నీకు మి
త్రులె వరో గదా ! పరమధూర్తశిరోమణిపుంగవాగ్రణీ !

౧౪౪

నీవాఁక 'పత్రికన్' నడపు నేర్పరివంట విచిత్రమైన హ
త్యావిధికర్మకాండమున కందుఁ బ్రణాళికలిత్తువా దురా
త్మా ! విధి నీకుఁ దగ్గ వసుధాఽసురవంశము యిచ్చె; నీవు పా
పావిలమూర్తివై తివిగదా! యిఁక నిన్ను సహింప రెవ్వరున్

౧౪౫

వలవల యేఁడ్చి, మాతరమువారిఁక సర్వధరాతలంబులోఁ
పలఁ దలయెత్తి యెట్లు నిలుపంగలమా యని బెగ్గడిల్లి కాల్
నిలువక క్రుంగి యిప్పటికి లేచియు వీథికి రారు బుద్ధిమం
తులు నిన్గన్న దేశమున: ధూర్తుఁడ! నీకెటుతోఁచెనో గదా!

౧౪౬

పయిగా క్షాత్రము బ్రాహ్మ్యమున్ నెఱపియావద్భారతం బేక దీ
క్షయుఁ గైకొంటకు మూలమెవ్వరో యెఱుంగన్ లేవె మూఢా
త్మా! నిం
దయె నీనెత్తిని మోయనేర్చితివె! నీ దౌర్భాగ్య మేమందు! సం
శయ మింకేల! కఠోరనారకనివాసం బొందియున్ గుందవే !!

౧౪౭

గీతాభాష్యము వ్రాసి లోకము పరీక్షింపగ విజ్ఞానవి
ఖ్యాతుల్ లెస్సగడించి దేశమున కజ్ఞానంబుఁ బోకార్చి ప్ర
ఖ్యాతుండయ్యె-తిలక్ ప్రభుండు: సరిగాఁ బ్రారబ్ధమిట్లాయె-దు
ర్జాతుండీతఁడు వాని జాతియు మహారాష్ట్రీయుంగా నయ్యెనా !

౧౪౮

ఆ వీరాగ్రణి శ్రీశివాజిచరితం బాసేతుశీతాచలం
బేవారల్ గణుతింతురో హరి ! యది నీ కిష్టంబు గాదోటు! మూ
ర్ఖా' వైషమ్యము తెచ్చిపెట్టితివి శ్లాఘ్యంబైన తత్కీర్తికిం;
జావన్ రా దెజనించునాఁడె యిఁకహింసామూర్తివై యుందునా

౧౪౯

ఒకనాఁ డద్దమరేయి నొంటిమెయి నేదో దృష్టికి వచ్చి కో
రిక విన్పించిన యన్యకాంతఁ గని సంప్రీతిన్ శివాజీప్రభుం
డకలంకంబగు భక్తిఁజూపె నిది యేమయ్యా యద్దేదేశ మి
ట్టికిరాతుం గనిపెంచె ! నెవ్వఁడిఁక లేఁడే వీని శాసింపఁగా !

౧౫౦

తిలకుప్రభుండు దేశమునఁ దీర్చియు దిద్దిన రాచబాటలో
పలఁ బోలుపైన యంశమును బాయక బాపుజి, స్వీకరించి లో
కులకు స్వరాజ్యమిచ్చెనిదిగో. యని మొన్న నె: దానికిట్టి హ
త్యలు తగునా కృతఘ్నుఁడ! కృతాంతుఁడు నిన్నిటు ద్రుంచి
వైచునో !

౧౫౧

నీదు 'ముతా' యొకండు ధరణిం గలదంచును నాఁడునాఁటి కే
వో దొరకంగసాఁగె సమయోచితమైనవి వ్రాఁత; లందుచే
బాధలు పెద్దగాఁ బెరిగి పాపము పున్నెము లేక దేశ మే
దో దురవస్థలో దొరలుచున్నది—ముందిఁక నెట్లులుండునో

౧౫౨

జరిగినదానికిన్ వగవ జాలకయుండడముగాని, లోక మి
త్తఱి నిఁకనైన బుద్ధి స్థిమితంపడి యుండుట లగ్గు; బాపుజీ
జరిపిన యుద్యమంబును నిజంబుగ నర్థముచేసికొంచు న
త్తెఱఁగున సంచరించుటయె దివ్యపరిష్కృతి యెల్లవారికిన్

౧౫౩

మొదలుకృశించి యెత్తువడి ముచ్చటతీఱక బిక్కమోములన్
వదలకయున్న దేశమునఁ బాపము లిట్టివి పుట్టెనేని యా
పద/లెటుదూరమౌను! నవభారత మెట్టులు రాణసెంది య
భ్యుదయము తెచ్చుకోఁగల! దయోమయమైపడికూలిపోవదే!

౧౫౪

గ్రద్దలువోలెఁ బొంచియు దురాశకుఁజిక్కి-సప్రక్క-దేశముల్
ముద్దుగఁగూరుచున్నవి సమూహముగా దిగ్రమింగ నింటికిన్
బెద్దయుఁబోయె-నింక విలపించిన లాభము లేదు ధైర్యమున్
దగఁగొని బూని కావలయుదాని సమీక్షయొనర్పఁగావలెన్

౧౫౫

ఆయనపుణ్యమా యని సమస్తధరావలయంబు నేలఁగా
ధీయుతు లెందఱో బయలుదేఱిరి దేశములోన: వారి కా
ర్యాయితసహాయసంపద లయాచితరీతి నొసంగి రేని యీ
గాయముమాను స్వస్థతయుఁ గల్గును భారతమాతృదేవికిన్

౧౫౬

చీమయుఁ జావకుండఁ బరిశీలనసేయుచు భావిభారతం
బోమియు సర్వథా తగిన యున్నతి గూర్పఁగలారు: వారిఁగ
న్బ్రేమి తొలంగరా దవల—వారికి లోపడి వారు చెప్పిన
ట్లే మెలఁగంగ సౌఖ్యమది యెట్టులు దక్కకపోదు జాతికిన్!

౧౫౭

మనసుకలంక మాని యవమానముదీఱఁ బ్రభుత్వమిచ్చు శా
సనములు గౌరవించి పరుసంబులు పల్కక యైక్యభావముం
బెనఁగొనఁ జేసి యగ్గలపుఁ బ్రేమను బ్రోదియొనర్చు టొక్కటే
మనకు శరణ్యమార్గముసుమా! యిఁక నింతకుమించి లేదిఁకన్

౧౫౮

ఆయన బోధచేసిన సమస్తము నిప్పటికైన బుద్ధిలోఁ
బాయక శ్రద్ధగాఁ దగినపద్ధతిగా గుఱుతింతు రేనిఁ బు
ణ్యాయతనంబుగా ధరణియంతయుమాఱియుఁ గ్రొత్తలోకమై
పోయి మనోజ్ఞమై నుతియుఁబుట్టఁగఁ జేయదె బ్రహ్మకేనియున్!

౧౫౯

దేశమ లన్ని దెబ్బతిని తిక్కయడంగియుఁ గ్రుంగికూలి యేఁ
దో శ్రమమోర్వలేక తగునోపిక చూపను జేతఁగాక య
త్యాశకుఁబోయి పిట్టపిడుగ్గైన యవస్థకుఁ జొచ్చి శాంతికై
యాశపడంగఁజూతుము;మహాత్ముని మాటనునాఁడువిన్నవే !

౧౬౦

ఏఁబదియేండ్లనుండి సుఖ మేదియు లేక యనారతంబు సం
ఖ్యాబహుళంబుగా ననుచరాళియుసైతము స్రుక్కిసోలి తో
డై బవరంబు శాంతిమయమైనది చేయ-స్వరాజ్యమిచ్చి యా
పై బలమింతఁగూర్చె;నిఁక భావియుగంబున భాగ్య మెట్టిదో !

౧౬౧

ఉత్తర హైందవంబున గుణోత్తరు లెందఱో వీరమూర్తులై
యెత్తినకత్తు త్యాగము పరీక్షగఁజేసియుఁ బ్రాణమిచ్చి య
త్యుత్తమరీతి దేశమున కున్నతి గూర్చిరి;దీని కెన్నఁడుఁ
గత్తిని దూయరైరి యపకారమొనర్చియెఱుంగ రేరికిన్

౧౬౨

ఇఱుకునఁబడ్డ దేశమున కిప్పటికైనను మోక్షమిచ్చి సం
బరమునుగూర్ప నేర్చినది బాపుజియాత్మయె; యారహస్యముం
గఱపెడివానిజీవితముగాథ యెఱింగియు భారతీయు లం
దఱుఁ దరియింప రే!యదిప్రధానముగామది నెంచ రే యిఁకన్

౧౬౩

ఇంతయు దైవలీలయనియే గుఱుతించి సమస్తలోకవి
భ్రాంతిని గూర్చు తామసముపజ్జఁ బోవక భారతీయధీ
మంతులు శాంతిదూతలు ప్రమాణముగా మనకిచ్చియున్న వే
దాంతము నమ్మఁగావలెవృథాయనరా దొకయింతయేనియున్

౧౬౪

మతముసమన్వయించి సుకుమారముగా నొకత్రోవచేసి యిం
పితమగు జ్ఞానదీప్తిమొలిపించి యమూల్యఫలంబు దానిలోఁ
బితుకుచు సర్వమానవులప్రేమను గ్రోలిన యా మహాత్మ జీ
వితమొక వెల్గుగా వెలసి విజ్ఞతఁ గూర్చెడుఁగాత భూమికిఁ!

౧౬౫

తమదోసమ్ములెఱింగి, యాయనకుసంతాపమ్ముచేకూర్చి యా
క్రమమార్గంబున విఱ్ఱవీఁగుమనుజుల్ రాఁబోవులోకంబు నా
శము గుర్తించిమెలంగియింకనయినన్ స్వాంతంబు దౌష్ట్యంబులే
శముగానీ కనరాక హాయిమెయి నిచ్చల్ మంద్రుగా కిద్ధరన్!!

౧౬౬

ఆయనధర్మసూత్రముల కందఱు నొదల లొగ్గి దాన-భ
ద్రాయితమైన శాంతిపరమావధి నేర్తురుగాత! సర్వదే
శీయుల జాతిభేదగుణశీలములందలి వైపరీత్య మా
యాయివిధాల గ్రూపఱి యనంతసుఖం బొనరించుఁగావుతన్!!

౧౬౭

తీతికచూచి దీని సరిదిద్దుటకేని మనస్కరింప కా
తీరున వేఁడియూఁఅనివి దెచ్చియు నచ్చున కిచ్చినాఁడఁ;గ
న్నీరిటులింకుడాఁక మహానీయుని దివ్యమహత్త్వతత్త్వమున్
గూరిచి నేర్చినంతవఱకు౯ నుతియించితిఁ జిత్తగింపుఁడీ!!

౧౬౮

అవధానంబుగ నశ్రుతర్పణముగా.నా దివ్యునింగూర్చి నా
జవసత్త్వంబులు క్రుంగి.కూలియు మనస్తత్త్వంబు వక్రించి సౌ
ష్ఠవహీనంబయి యున్నయిట్టితఱి నిష్ఠ౯ జిన్నికావ్యంబు వ్రా
*సి విచారం బదితీర్చుకొంటిని 'నమస్తే'సర్వలోకేశ్వరా!



* 31-1-48 మొదలు } రచన
16-2-48 తుది }

## ఈ గ్రంథకర్త

వైదికవాఙ్మయ చరిత్రము
సతీసప్తశతి (పద్య)
కథావింశతి
(చంద్రాపీడచరిత్ర)
కామశాస్త్రము
కావ్యమాల 1 భాగము
కావ్యమాల 2 భాగము
సుభాషితము
ధర్మశాస్త్రము
కవులకథలు
వరరుచి
ఈశ్వరసేవకులు
విక్రమకథలు
మొక్కుబడి (పద్య- కా)
నవనాథము
బ్రహ్మహత్యకథలు
వత్సరాజు
విక్రమాదిత్యము
సాలభంజికలు
బాపూజీ (పద్య- కా)
కలిపురాణము ,,
నవభారతము ,,
లోకతంత్రము ,,
పండితుడు ,,
వసంతసేన

భాషాపోషక గ్రంథమండలి
అమృతలూరు - గుంటూరు జిల్లా